

*Dedicated To*

**SRI THANGIRALA VEERARAGHAVAIAH**

*Zamindar*

*of*

AMPAPURAM, CHINALINGALA ETC., ESTATES.

***General Superintendent of Branches & Agencies***

NATIONAL INDIAN LIFE INSURANCE COMPANY, LTD.

# అంకితము

లేమ కృష్ణ కౌగిలింప వార్నిధి నెడ
మాయె 'అవనిగడ్డ' నాయకమణి
దాని కాంతిచయము, తత్రత్య వేద వే
దాంగవిన్మహాద్విజాళి గాంగ

ఇది వేదభూమి యిచ్చట
మొదలిచదువు దివ్వె వెలుగు ముడుగకయ పటిం
బడి చమురు పోసినట్టిరు
పృదాను పరివృఢసమాన వెలనాటి ద్విజుల్

అస్పృహావాదు లమత్సితుల్ హుతభుగర్వాధీన ధీసత్వు లు
త్తమపాండిత్యులు సంప్రదాయమతు లద్ధాశీలు రానంద వి
క్రము లాదేష్ట లనీచబుద్ధు లసమాకాంక్షితుల్ మహోదారు లా
శ్రమబద్ధుల్ వెలనాటు లాంధ్రజనకాసారాంబుజాతాకృతుల్

'తంగిరాల' పేరి వంగసంబున సోమ
యాజి పౌండరీకయాజివితతి
యవనిగడ్డయందు నాది దీక్షితవాద
సంప్రదాయభృత్ప్రజాపతితతి

సూరివాళి సుబ్రహ్మణ్యసోమయాజి
మూలభూతుండుగాఁ దంగిరాల వంశ
కల్పవృక్ష మాగ్నీధ్రప్రకాండ మయ్యె
విస్ఫురద్ద్విజశ్రేణి తర్పితము గాఁగ

భార్గవుడు చ్యావనుం డాప్నవానుఁ డౌర
వుండు జామదగ్న్యుం డయి పొలిచి తంగి
రాలకులము పంచార్షేయ ప్రథిత మగుచు
గోటి కెక్కె శ్రీవత్సస గోత్ర మగుచు

వారిలోన రామబ్రహ్మ పౌండరీక
యాజి ప్రగ్రహధృత మనోవాజి నవత
టాకనిర్మాత మధుమధురాంబుదాత
దాత యీ కృతినేత ముత్తాత తండ్రి

కలి ముదిరి వేదవిద్యపై గౌరవంబు
పోషణంబును దక్కువై పోయి కావ్య
జాని తండ్రి శ్రీ రామావధానిగారు
బ్రదుకుకత్తి రెండవవైపు పదును పెట్టి

ఇటు చెఱువులు త్రవ్వించెను
అటు చరువుల హావిసు వేల్చె స్వాధ్యాయ సదా
స్ఫుటవాణి జనము మెచ్చఁగఁ
బటువగు లౌకికముఁగూడఁ బరిపాలించెన్

ఆ మహాత్ము భార్య రామ. సీతాదేవి
యాలు మగలు తప్పితాత్ము లగుచు
ముగురుసుతులఁ గనిరి మూఁడవపుత్త్రుఁ డీ
రమ్యకావ్యభర్త రాఘవయ్య

జరయు మృతియు లేక చనునట్లు ప్రాజ్ఞుండు
ధనము విద్య గూర్పఁ దలఁపవలయు
ధర్మ మాచరింపఁ దగు మృత్యుచేఁ దల
పట్టి యీడ్వఁబడినవాఁడువోలె

అన్న నన్నయ్యగారి వాక్యంబునకును
లక్ష్యభూతంబుగాఁగ నిలం జరించు
తంగిరాల కులాబ్ధి సుధాకిరణుఁడు
రమ్యగుణశాలి శ్రీ వీరరాఘవయ్య

మరియుఁ గొందఱు ముట్టిన మట్టి యాను
పైడి రాఘవు హస్తంబు పరుసవేది
బంధురాజికి నితడు సౌభాగ్యవేది
బ్రాహ్మణశ్రేణి కితఁడు ప్రపావివేది

ఆ రామాదిక ధర్మ
ప్రారంభ విభాసి రాఘవయ్య త్రియా వి
ద్యారక్ష సేయుఁ దొలిమే
లూఁకరఁగఁ గలి మొగము రంగులో ముంచునటుల్

మధురహాసన గల్లాకృతి
విధుమతి వేదార్థనిధి వివేకనటద్రూభా
పృథుమతి 'కుప్పా లక్ష్మా
వధాని' తత్పరశాల పరిపాలింపఁగ

ప్రకటమతి రాఘవ ల
క్ష్మీకామేశ్వరుల గర్భమేదిని సస్య
శ్రీకోమల మగుఁగావుత!
చేకొని తత్కీర్తి తెలుపు సేయుత దిశలఁగ

మరునాడు కలసికొనఁగా
నిరువురు విడిపోయి రిద్ది యేమి వికట రా
తిరి తెలవారుట తప్పని
సరిగాఁ దెలవారె మరల స్వామియు వచ్చెన్

స్వామిదెస నామెయొక్క పరిచర్యచేయు
నామెదెస స్వామి యొక్క-స్వామ్యమ్మె నెఱపు
పైకి నెయ్యమ్మె లోపలి భావ మేమొ
పొంగక జగదంతర్యామివోలె నుండు

పోవ నిష్టము లేకయుఁ బోవఁ దప్ప
కొక దినంబున స్వామియు నూరి కేగె
నాల్గుదినములు మసలునైనదియు నచట
నంత పని చేయుటకు మనసాడకుండ

ఇచ్చట దేవసేన ప్రభు వేగిన సంగతియే యెఱుంగకన్
వచ్చు నటంచుఁ జూచి మఱి వచ్చుట కన్పడ కెంత వేళకున్
గ్రచ్చుఱఁ దాను శానియొడ రా నని చెప్పుట యేమి తప్పు నా
మచ్చరికించి రేపటికి మత్సరమున్ విడి యేమి తోచకన్

తనలోన మాకందతరుకిసాలయ మేలొ
యురక కోపించునం చూహ సేయు
దూరానఁ గోకిల వైరానఁ గవ్వించు
పద్ధతింగాఁగ భావన పొనర్చి

చలువ జాబిల్లి వెల్గుల వేగమున నిల్వఁ
ద్రొక్కఁకోలేనట్లు తూలిపోయి
అది యెన్న డనుకోనియది మలయాచలా
నిలము కవోష్ణమ న్తలపు గలిగి

ఏదొ గ్రంథము చదువఁగా నెంచుటకును
దానిపై నుంతకోఁక గ్రంథమ్మొ లేక
కోడికూయుట విన్ను మేల్కొలుపఁగాక
తెలిసికొనె నూరకయ యటంచుదేవసేన

ఒడలు పులకరింప నూహించి కారణం
బతనిఁగూర్చిన యూహ యంచుఁ దెలిసి
ఎవ్వరో యడిగిన నేదియో మారు చె
ప్పఁగవచ్చు స్వామియ న్పలుకు నాపి
నెమిలంచుచీర యుండిన దొకఁటే దాని
వదలక తాల్చి పవలు నిశలు
ఉలక మేదో గీయచుండి యాలవసంఖ్య
కృతసహస్రంబుగా గీసి తెలిసి

అమరనాథునిఁ దనసేవకాళి స్వామి
యంచు నాడిన హృదయంబునందు నురిసి
తెలియరానట్టి బాధగా దేవసేన
నాలుఁగుదినాలు నాల్గుయుగాలుగాఁగ

ఐదవనాడు ప్రాంగణమునందున నా నిలుచున్నయట్లు చం
ద్రోదయవేళదాఁక నిలుచుండి సురేంద్రుఁడు వీట లేకపో
గాఁ దనుఁ బల్కరించుటకుఁగాని భయంపడియుండ సేవకుల్
సూదులవోలె గ్రుచ్చుకొనుచుఁ వెలివెన్నెల ప్రసుక్కఁ జేయఁగా

కనులు తెఱచియుండెఁ గాని వచ్చెదనట్టి
మనిసి నెఱుఁగు తెల్వి తనకు లేదు
అంత స్వామి వచ్చె నతులలోఁ బ్రిణ
మున్నవాఁడు తూలుచున్నవాఁడు

వచ్చి దేవసేనప్రక్క కూర్చుండెను
తనువు తనువు నానుకొను విధాన
వెచ్చనైనయట్టి వేసంగివెన్నెల
సన్న సన్నగాఁగఁ జల్లనయ్యె

చెక్కిలి చెక్కిలి నానిచి
యొకరిబుజమందు వ్రాలి యొకరు కరములఁ
నొక్కుచు భుజముల మనసుల
సుక్కిసతన మెల్ల మాన్చి సొక్కిరి తుదకుఁ

స్నేహము చిత్రమైనయది చిత్తము లెంతటి దగ్గరైననుఁ
దేహము లంత దగ్గరకుఁ దెచ్చుట కింకొక వేళ కావలెఁ
సాహసకార్యమౌఁ బెఱల సజ్జనులం దెడఁబాటుకాక స
ద్వ్యూహ్య[illegible] [illegible]త్రముల యూపుట దగ్గరసేయు మేనులఁ

శ్రద్ధగా నీతిశాస్త్రగ్రంథ మొక్కండు
స్వామియుఁ గూర్చుండి చదువుచుండ
అతని బుజంబుపై నానిచి చిబుకంబు
దేవసేనయు దానిఁ జూచుచుండె
స్వామి వామకరంబు పైకెత్తి యామెను
మెడకును దగిలించె మెలికగాఁగ
ఆ సమయంబున నరుదెంచె నింద్రుండు
నింద్రుని రాక వారెఱుఁగలేదు

అమరనాథుండు నిస్తబ్ధుఁడై యొకింత
యంతలోఁ జిఱునవ్వు నచటినుండి
వెనుతిరిగి సద్దుసేయక వెడలిపోయె
భయముచే నట్లు నిట్లు సేవకులు తొలఁగ

ఒక్కదినంబున స్వామియు
నక్కలికిం గాంచి నీకు నమృతదృశాంతా
చిక్క యహల్యాజారులు
నెక్కడి జనకులు వచింపవే యని యడుగన్

తమరేమొ వేదమూర్తులు
నమరేశ్వరు నట్టు లనుట యది మీకె తగున్
తమరిని సేనాపతిగా
నంచు మరి యందుకేగదా శివమూర్తీ!

ఓం.

# శ్రీ వల్లీదేవసేనావిజయము

పన్నిద్దరైనట్టి భాస్కరుల్ పొడిచిరో
యనఁ గాంతు లుమిసెడు కనులవాఁడు
కూయఁగా నిక్కిన కుక్కుటస్వామిఁ షా
గద్దించు ఫాలభాగంబువాఁడు
శక్తి యిం కెక్కడ సహకూడ దన్నట్టు
లమరిన బాహుదండములవాఁడు
కాలిపిక్కల వెండ్రుకలు నెమ్మికన్నుల
జిలుగు జగాజిగుల్ చిమ్మువాఁడు

అతని తేజమ్మె యర్థమైనట్లు వానిఁ
వంకఁ గాంచిన శౌర్యశబ్దము స్ఫురించు
నట్టి యొక్క కుమారుఁ డింద్రావసథము
చిత్రమగు సావడిఁ బచారు చేయుచుండి

తనుఁ బిలిపించి యింద్రుఁడును దారకదైత్యునినుండి యెల్ల పృ
థ్వీని గెలువంగ నా పనిసెట్టెను వేలుపుసేన యొక్క దా
రిని జనకుండేఁ దన్నును ఏరించెఁ జమూపతి నిట్టి క్లిష్టమై
న నిముసమందు నాయన మనస్సు మనస్సున లేకయుండఁగా

వానకాల మన్న భ్రాంతి సందీపించె
నిందుమేడ నెరిగె నింతలోన
నల గవాక్షమందు నరసె నొక్కలతాంగి
తన్నుఁ గాంచుచుండఁ గన్ను లుంచి

తానుగూడఁ గన్నుఁ దరలింపకయు చూడ
నామె మొఱఁగి చనియె నచటినుండి
యంత నా గవాక్షమంత శూన్యం బయ్యె
నతని యెడఁద శూన్య మయినయంత

ఇంతలో నింద్రుఁ డరుదెంచి యేమి స్వామి
యనిన నేమి స్వామీ యనె నా కుమారుఁ
డతనిమూర్ఛాసమంబైనయట్టిస్థితికి
మఘవుఁ డాందోళనం జెంది మనసునందు

దిగ్గున నెవ్వరేఁ జలము తెండని పిల్చెను వేల్పుఱేఁడు నా
దగ్గర నున్న యా మెఱుపు తా జలకుండిక తెచ్చి నిల్వఁగా
సిగ్గున దాఁగుచుఁ గనుల చెంతలఁ గాంచెద రొక్క రొక్కరుఁ
దగ్గరనుండి యె [illegible] స్వప్నలనుండిన యట్లు లెంచుచుఁ

వినయముచేతఁ బాత్రి నటఁబెట్టి వశాసమయాన యేగె గ
మ్మనఁ ఘన సుగ్గబట్టిన కుమారుఁడు నేమి యెఱుంగనట్లుగాఁ
గనులను నీర మద్దుకొని కన్నుల తెల్వగ నేదొ విచ్చిపో
యిన తెరయట్లుగా నభినయించుచుఁ జేసెఁ జపూప్రిసంగముల్

పావడిలో లేవి స్వామికై ముక్త
వాక్షంబునందు పరీక్ష సలుపు
కనకపాత్రికతోడఁ గైకొని జల మూర
కయ పోవుఁ జానడి గడపదాఁక
కడఁగి యుద్ధప్రిసంగములు పలెకడు శుకీ
వ్యాహారములు శ్రద్ధ నాలకించు
వినయాన నటనుండి వెడలెడు గతివశా
సమవైఖరీ మంధరముగ నడచు

పగటనే కోడికూసినపగిది ప్రిక్క
మీఁదినుండి హఠాత్తుగా మేలుకొనును
తన చదువుచున్నయట్టి గ్రింథంబు మొదటి
దాపుటయుఁ దిరుగద యొంతసేపటికిని

ఇట్టుల నుండికూడఁ బ్రిభు వింటికి వచ్చినవేళఁ జావడిం
బట్టను స్వామి యే పసియుఁబట్టక వచ్చుచు నుండె నైమనా
ళ్ళిట్టుల సాగఁగా నెడఁద నిద్దఱును న్నిలుపంగలేక నా
డెట్టులనైన కోర్కె నెలయింపఁగ సా[illegible]యు కాక యొక్కటన్

కౌగిలించినంతగా నెట్టయెదురుగాఁ
గలసికొనిరి లోనిగడపమీఁద
కౌగిలించునట్లు కరములు నెత్తిరి
వినయభావమునను వెనుకఁబడిరి

స్వామి యడిగెను నీదు పే రేమి యంచుఁ
దెలియ చెప్పెను మఱి దేవసేన యంచు
ఇద్దఱును నవ్వినంతలో నెన్నినాళ్ళ
దైనదో యొక్క పరిచయ మవతరించె

ఇరువురు సాధునాగరకవృత్తులు కోర్కెప్రసక్తి తేక సం
గరమును నందులో మఘవుకార్యము తారకు గెల్చు నీతిలోఁ
దెసువులు ముచ్చటించుచు నతిప్రమదాకృతి ప్రొద్దుపోయి యం
బరమునఁ జందమామ కనుపట్టిన నట్టులె మాటలాడుచున్

ప్రొద్దుపోయి వేలుపుల ఱేడు వచ్చిన
యపుడు నట్లె మాట లాడుచుండ
వారి యింతయైన పరిచయం బంతలో
నెట్టులయ్యొ మఘవుఁ డెఱుఁగలేడు

చదు విద్దఱకును జుట్ట
మ్మది యెఱిఁగిన యంతలోన నాప్తత కలుగున్
హృదయములు మున్నె విద్యా
సదనంబునఁ గలసియున్న సరకులు గానన్

తనర నరిష్టనేమి యను దానవనేతకు రెండుకన్నులై
తనయులు గల్గి రిద్దఱు మృతామృతబుద్ధులు దైత్యసేన కో
పన, దను నీతిశాస్త్రమునఁ బండితురాలయి దేవసేనతో
ననయము మచ్చరించుఁ గలితామరనీతిమతిప్రగల్భతో

కడువడిఁ బాపముల్ కలిపికట్టిగఁ గట్టినయట్టివాడు దై
త్యుఁడొకఁడు కేశినామకుఁడు దుష్టసురారి నయపరిచార లు
బ్ధుఁడు మఱి దేవసేనపయిఁ బూనిన మత్సరభావ మొప్ప న
ప్పడఁతుక కెట్టులైనఁ బరిభావముసేయఁగ నెంచు నిచ్చలున్

జనకుఁ డరిష్టనేమి దితిజప్రభునీతిని దోషసంచయం
బను వచియించు నయ్యఖిలమున్ దనకూఁతురు దేవసేన నే
ర్పిన దని వ్యాఖ్యసేయుదురు వేదురుపొంపెన సర్వదైత్యు లం
తన మఱి దేవసేన యన దానవజాతికి గుండెదుంటయౌ

వ్రాలి యె దేవి దుష్టమగు రాక్షసనీతిని జూపు గూఢమా
వేశను దేవసేన గొని పెట్టుచు నుందురు కారలోన న
య్యాలరిచేఁతలోని దగు నర్థము స్పష్టముచేయు నంచు నీ
లీలను సేనఁ దట్టుకొనలేక యెటో వధియింప నెంచుచున్

అమరశ్రేణిని దానవావళికి నాహారంబుగా సృష్టి చే
సె మరిం దైవ మటంచు వారి దసలౌసిద్ధాంత మామాట స
త్యముగాఁ గొందఱు దేవతల్ నడువ నా దైతేయసంతాన మ
క్రమమార్గంబునఁబట్టి బిట్టు మితిమీఱన్ నేను దుఃఖించితిన్

విష్ణువే రాముఁడో యయి పృథ్విఁబుట్టి
సర్వరాక్షససంతతి సంహరించు
నసురు లందఱు చావనియట్లు నేను
క్రొత్త యొకనీతి కల్పించికొంటి నెడఁద

సర్వసృష్టియందు సతిపైన సంతతి
పైనఁ బ్రేమ లేనివారు లేరు
ప్రేమ యెచటఁ గలదు హృదయంబునం దుండె
త్రివ్వి తీయఁదగినదానియందు

దయ ప్రేమయొక్క రూపము
దయ పుట్టగఁ జాలదవ్వు త్రివ్వఁగవలయుఁ
దయ పుట్టె నేని రాక్షస
చయ మైనను వేల్పు లగుట సమకూడుఁగదా

శతధృతిఁగూర్చి నేఁ దపముసల్పితి నన్నును గొంచుఁబోయి దే
వతలను నొక్కసూరునకు భార్యను జేయు మటంచు నాతఁ డి
చ్చితి నన్నఁ గేశి నా తపముసేఁత నెఱింగి య దేమొ కీడు కో
రితి నని నేను వారికి దరిద్రుడు నన్ను హరింప నెంచుచుఁ

నన్ను నిద్రపోవుచున్నట్టి దానిని
నెత్తుకొంచు మింట నెగిరిపోవ
మింటియందు నాకు మెలఁకువవచ్చి నే
నరచుచుంటి భయమునంది బిట్టు

కాశికింబోయి యచట విశ్వేశు సేవ
జరిపి యింటను వచ్చెడు హారిహాయుండు
నటపులన్ విని వచ్చి వజ్రాయుధమున
చండవేగాని కేశిని సంహారించె

నన్నుఁ గూర్చి మున్నె విన్నాడు నే నని
తెలిసి సంతసించి తెచ్చినాడు
ఆతనికిని నేను కూఁతుర నైతిని
నాటనుండి స్వామి నేటివరకు

నేటినుండి యింక నీ వేమి యౌదువో
చెప్పు మన్న దేవసేన నవ్వెఁ
గాని తండ్రి యాయఁ గావలెఁగద తాన
యన్నిన స్వామి తాన యడుగ ననియె

ఒకపని చేసిపెట్టి ధర నొక్కని కోరినఁ గోరవచ్చుఁ దా
రకుని జయించి పోయి యమరప్రభు నే నిఁక దేవసేనఁ బొం
దక బ్రదుకంగలే నననఁ దా నమరేశ్వరుఁ డీయవచ్చు నా
రక చని యిమ్మంటచడుగరా దడుగంజుమి నే సురేశ్వరున్

మా యింటికి రా! పోదము
మా యమ్మను జూతుగాని మా యమ్మ యనన్
మా యమ్మ యనంగా నీ
వే యెఱిగెదు నేను చెప్ప నేలే సేనా!

అనిన నిట్లనె నవ్వుచు నంబుజాక్షి
అత్తగారేమొ పరమదయాసముద్రు
రాలె మీ నాన్నగారికి వ్రాలి ముక్కు
పైన నుండున టంద్రు కోపంబు స్వామి!

భ్రూమలినంబుగాఁగఁ బెడమోముగ నిశ్చలదృష్టిరేఖగా
స్వామియుఁ గూరుచున్న నవవారిజలోచన యేగి స్వామి బా
హామృదుదండముం గరమునం దెమలించి యిదంతకోపమే
నా మఱి నవ్వుటాల కనినం సిగబారెడు చేసికొందురా?

మఱియు స్వామియుఁ గోపంబు మానకున్న
దండ్రి యనుమతి వలదు పద చనుదెంతు
ననిన స్వామియు లేచె, వెంటనె లతాంగి
యతనిబడి యేగె విడిచీరయైన లేక

ఊరితుదిదాఁక జని పొలిమేర దాఁటి
కమ్మని పొలాలనడుమగాఁ గాలిబాట
వెడలుచుండిరి మును స్వామి వెనుక సేన
బాటవెంబడి నొకమాట పలుకు లేక

ఎచటనుండియో వచ్చెడు నింతలోన
నెట్టయెదురుగ నమరలోకేశ్వరుండు
నాయనం గాంచి కళవళ మంద స్వామి
కా[illegible]గ లేడయ్యె సౌరపతియు

ఇరువురివంకఁ గన్గొనగ నిర్వురు పల్కరు కొంతవేళకున్
హారిహాయుపాదయుగ్మమునయందున వ్రాలెను దేవసేన యా
హారికిసి నవ్వు డర్థమయి యాస్యమునం జిఱునవ్వుతోడఁ దాం
దరపడి రిద్దఱున్ సరి పదం డని ముందున కేగి వెన్కకున్

మరలి యిటు లనె శూరపద్మాసురున్ వ
ధించితివి స్వామి! నీ కిచ్చి దేవసేన
పెండ్లి సేయంగ నెంచితి వెడలి బ్రహ్మ
తోడ వచియించి వచ్చుచున్నాడ ననుచు

ధృతి నారగ్వధబాలపత్రికసితశ్రీ వొల్చు చిర్నవ్వులన్
బృతనాసాహుఁడు వెళ్ళిపోవఁగ భుజావేల్లల్లతా తన్వియై
శితికంఠప్రియసూను డేగె దెసలన్ క్షేత్రంబులం గంకె ల
చ్యుతుఁడై కోయుచు నూచబియ్యమునుదించుం బాటలం బాడుచున్

ఇది సేనాసమీకరణ మను
ప్రథమాననము

ఓం.

# శ్రీ వల్లీ దేవ సేనా విజయము

ఉడుకఁగఁ బెట్టునో ప్రాయి నహా• యొకగిద్దెడుబియ్యమైన బిం
దెఁడు జలమైనఁ దేఁగలుగునే యిది యే దొర కన్నకూఁతురో
లోఁడితెము లేదు చూడఁగఁ దలోదరి పాదలిమూఁకలోపలం
జెడితివి కాపురానికి హానిసీయుసి నెచ్చటఁ దెచ్చినావురా!

పడినపాటులు పడని దేవతలుగాని
తారకాసుర సాగరోత్తరణకరణ
నావ నీ వౌదు వంచు నున్నారు నీవు
చెలఁగి యిందుపగంజఁ దెచ్చితివి పోయి

పుడిసిలించినవాఁడు విడిసి పట్టు మని సా
గరవారి పెనుతరంగముల గములు
దుసికిలించినవాఁడు తూఁగి తూఁగించి మం
దాకినిఁ జలిపర్వతంబు గూడు

మొదలకించినవాఁడు పొదరు కన్బొమల నీ
లిమచేఁ బ్రిభాతనాళీకజన్ము
నురవడించినవాఁడు బిరుసుగడ్డైన మం
చుంగొండలో బీట్లు చూపునట్లు

ఎవ్వఁడో యొక్క తేజోమహీయు కూఁతుఁ
దెచ్చియుండిన దైత్యు సాధింపవచ్చు
వేల్పు లనుకొన్నయట్టిది వేఱు నీవు
చేసినట్టిది వేరోయి చిట్టితండ్రి

అతితరభీతి నందితిసుమా నెల తక్కువబిడ్డ వంచుఁ బా
పతిమిరలుప్తిమై బ్రితికి బట్టనుగట్టితి వంచు సంతసిం
చితి నొక గొప్పయింటిదగు చేడియఁ గన్గొని పెండ్లిచేయ నెం
చితి నిటు తల్లికిం దెలియఁజేయకపోయితి తెచ్చి తీయమన్

నాయనా! నీవు నెన్నిగండాలు గడచి
బయటఁబడినావొ తలఁపునఁ బారి నేని
శాంతమై యుండి నా యొడల్ జలదరించు
నీశ్వరకటాక్ష మున్నది యింతవరకు

ఇది నా భాగ్యము చూచెదన్ జిఱుతతండ్రీ! ఆయొడల్ తా నెఱుం
గదు నీ పుట్టినవేళ నీ జనని పైఁగాఁ గొంప నిప్పంటుకొ
న్నది తండ్రీ! యది చాల దన్నటుల పైనన్ బొంగి భాగీరథీ
నది యిల్లంతయు నీటిలో మునిఁగి నానాబాధలై యుండఁగన్

ఆ వరదలోన నెచ్చట
నీవో నా తండ్రి యెచట నేనో తెలియం
గా వీలులేద చివరకు
నీ వగుపించితివి కొన్ని నెలలకు నాకున్

వరదలోఁ గొట్టుకొనిపోయి వరద తీయు
నొడ్డునను జొల్లుతోఁటలో నొండులోనఁ
జిక్కి కడు పుబ్బు నేడ్చెదు చిట్టితండ్రి
నిన్నుఁ గని జాలి యేరికి నెగడకుండు.

పతులను భీతులై పొరుగుపల్లియ బ్రాహ్మణకాంత లల్లదాం
గతనముగాఁగఁ జన్గుడుపఁగాఁ దెలిచిక్కని జొల్లుపూల సం
గతిఁ జిబుమి త్రపాత్రులఁ బగళ్ళను రేలును సాగిపోవఁగా
బ్రతికితి వీవు నాదయిన భాగ్యము మంచిది రయ్య యింతకున్

ఆటుగును చంద్రు లుదయించినట్టులైన
నీ మొగము చూచి చల్లనై నెగడెఁ గనులు
పసుపుతోఁటలో నంకురంబులవిధాన
తనుకు నా మేను పులకరించినది తండ్రి!

అనుచు నె కోడలిం గని హిమాచలకన్యక మల్లెపూల క్రొం
దనుకుల మేలిపల్వరుసదాన! సరాసరి తూరుపోత కొ
గ్గిన తెలిమొక్కజొన్న చిటుగింజలవోలికఁ జూచె దేల ర
మ్మని తన చేరువం దిగిచి యా మదలీచిబుకంబు నెత్తుచున్

ననుసిగ్గు బెళుకుకన్నుల
నినిచెదు నావంకఁ గనుము నీలాంబుజలో
చన యీ నా బంగరు తం
డ్రిని జెట్టంబట్టి ఇది యదృష్టము తల్లీ!

పేదసంసార మైనను పిల్ల! మాది
పరువు మర్యాదలకును లోపంబు లేదు
ఇచట నాయన లేకుండ నే పనియును
మసల దంతటివారు మీ మామగారు

సెనగబద్దంత లేనెలజిగి నొసంట
సిగ్గునవ్వులు చెక్కిళ్ళఁ జెరువు రేక
మనసుతో సదానించి చూచినను గాని
నీదు నందమ్ము తెలియదే సభ్మతహాసన!

నునుపులు తీసు వెల్గులఁ గనుల్ చెదరించును నిల్వనీయ దా
ర్చిన నడమంతరంపుసిరి చిక్కనగుండియ చిక్కఁబట్ట నూ
కొను పడుచోటనే వెదకికోవలె సీలువు రాల! నాదు బి
డను సుఖపెట్టు మమ్మ యకటా వికటంబుల సంచరింపక

చెడ్డసురాలికోసమయి జీతము బత్తెము లేని కొల్వు నా
బిడ్డది కాలిబంట్లయిన వేల్పులపై దుముదారుగాని యే
ర్పడ్డ సురారిమూకలను బారఁగఁదోలెడు వేళఁ గాక నా
బిడ్డ మనస్సులోపలను వేసులు త్రెంప్పుకొనుక మనస్వినై.

తెలియునో నీకుఁ దెలియదో జలరుహాక్షి
నా కొడుకు గొప్పకవిసుమీ నా యనుంగ!
ఊరక నెప్పుడు నూహించుచుండు నేదియొ
కూర్మి నీపయి లే దనుకొను మమ్మ

ప్రకృతి విచిత్రమైనయది బాలిక! పేదతనంబు మాకు న
చ్చిక యయినట్టిదా దినుసు చేడియ మా కులమింటికోడలై
యొకతుక వచ్చెనేని యదియున్ సిరితీపుల కంగలార్చుపో
లికయును మాకుఁ దగ్గటుల లేనిది యాటకు సంతసింతుమే

వినయము నేర్పునొజ్జసుమి పేదతనం బది గుండెలోన నే
జనుడు జగంబుబాధలకు జాలయి నీరయి పోవు వానియా
త్మను రససిద్ధి మార్గమునఁ దార్చెడు నిచ్చెన దానిచేతఁ దూ
లిన జను లెవ్వరున్ రసఁ జలింపరు వేరసమార్గమందునన్

పొండమ్మ సుఖంపడు మని
పండిన ముత్తైదు వత్త పంపిన సిగ్గుల్
పండిన చేనగు కోడలు
నొండు విఱుఁగు నదివిధాన నొఁగిఁ దేరి చనెన్

అమ్మ యే మన్న దన్నట్టు లాత్మభర్త
సెజ్జపైఁ బండుకొని దేవసేనఁ గాంచె
ఆమె సిగ్గులచిఱునవ్వులందుఁ దోఁచెఁ
బుట్టివి ల్వ్రీడ నగు భీతి పోయినట్లు

చిఱురేల చిప్పరాకుచివరి జగాజిగుల్
గిలకొట్టు లేఁతచెక్కిళ్ల మీఁద
తమిరసాలకిసాలయము చిట్టచివరలు
దమియించు లోచనాంతములమీఁద
హరినీలశకల భాసురరమాసుషమా స
ఖంబులౌ వక్రాలకములమీఁద
సొబగారు పుట్టుమచ్చబెడంగు జిగిపొంగు
కమ్మని నునుచిబుకంబుమీఁద

సాగువేఁ బోకజిగుల బుజాలమీఁద
ఓలి నులిసెదు నవకంకణాలమీఁద
నిఱుదెసల మేనిపులకల నెసఁగుచుండ
కమ్మసిగ్గులు ముద్దులు కలిసిపోయె

గోరువెచ్చన సుధాపూరకపోలమ్ము
పతి తీసికొను ఱొమ్ముపైన నాన్చు
మృదుకంపన స్వేదపదకరంబుల స్వామి
చిబుకంబు చిఱుతదోసింట నూను
చిఱుభీతియవ్వు వెనక తెరకాంతి విరఁజిమ్మ
వలపుచే భర్త కన్నులను గాంచు
పతిమనస్సునఁ గష్టపడినట్లు గ్రహియించి
బలిమా[illegible]గని తలవంచి నవ్వు

జలరుహాయతాక్షి తొలిసంగమము వేళ
చిన్నిస్వామి సుఖము చేదికొనియె
వలపు సిగ్గు భయము కలిసి ముప్పేటగా
పేనినట్టి కోర్కె పేర్మిఁ జేసి

సిగ్గును భయమును జంటగ
మొగ్గిన యవి భయము విచ్చిపోయిన నైనన్
సిగ్గును చెదరక యున్నది
సిగ్గునకే సిగ్గుకలదు సీమంతినులన్

సొలయునుగాని తాఁ గనిన సౌఖ్య ప్రకాశముకాకయుండ సి
గ్గు లొలుకు నాననంబు పెడకున్ మలయించుక భర్తబొమ్మపైఁ
దల యిడుఁ బెన్మిటిన్ నయనతామరసంబులఁ జూడఁబోవ దా
వలఁ జిబుకంబు నొత్తు పతిపాణినవాంగుళిఁ బంట నొక్కుచున్

తనయొడ లేమొ తీవ యని తాఁ బతి యాడిన వాని యొక్క చుం
బనబరమార్థమైన తనమై సుమవల్లరి యంచు స్వామి చె
ప్పినఁ దన మే న్సుధాసరసివీచిక యంచును భర్త యాడుచుం
డిన ననుభూతికిం దెలిసె నిక్కము లంచును భర్తృవాక్యముల్

చెలువుగ భర్తపాదములచేతఁ గరంబులచేత మేనిచే
సలలితచుంబనార్ద్రముఖసారసపంక్తులచేత వాని యు
జ్జ్వలపరిణాహ మంజుతరవక్షముచేతను జొచ్చుకొన్న య
వ్వెలదుక మేను కప్పఁబడి వే అగురూపమె లేసియట్టులై

తన మొగము రెండుచేతులఁ దాల్చి భర్త
వాల్పనీయక బిగువుగాఁ బట్టినంత
గజబిజి విలోచనంబుల కాంతు లొప్ప
తెచ్చికొని నవ్వ బిగువుగా దేవసేన

తనపదముల్ పతిం దగులఁగాఁ దొలఁగింప లతాంగి స్వామి వెం
టనె నలినాక్షి పాదనలినంబులు చేతుల నూని గట్టిగాఁ
దన యొడలందుఁ జేర్చికొని తాఁ దొలఁగింపగ నీయకున్న బీ
తున నది యొక్క ప్రేమగుణితో యని మిన్నకయుండెనామెయున్

పెంపుడుతండ్రికూడఁ గనిపించని యిచ్చట నత్తవారి పా
లింపులలో మెలంగనువలెన్ బతి కూరిమి నిల్చునట్లు సె
ల్లింపవలెన్ మనోహరుని లీల లటంచును గాక యొక్క సౌ
ఖ్యంపుఁ బ్రవాహవీచికలయందున నామెకుఁ దోఁచ దేమియున్

పతికి నిద్దురవచ్చెడుపగిది లేదు
నెలఁత తనకన్నముందర నిదురపోవ
నాతఁ డేమనుకొనునో యటంచు నెంచు
నెలఁత సొలసినకనులపై నిదురవచ్చె

స్వామిసుఖంబునుం జెలుపఁజాలక వాహనమైన కుక్కుట
స్వామియు యామినీపరవశంబుగఁ గూయక యూరకుండినన్
శ్రీమతి దేవసేన యెదఁజెందినదా నలనాటుచేత ని
ద్రామలినత్వమున్ వదలె దాపయి వచ్చిన వేఁగుఁబోకకున్

స్నానముం చేసి శుభ్రవస్త్రంబు తాల్చి
ముంగిటఁ జిత్రచిత్రముల్ రంగవల్లి
కలను దీర్చెడి కోడలిఁ గాంచి యత్త
యింతిచేఁ బరిచర్య చేయించుకొనియె

ఇది సేనాగ్రహణ మను
ద్వితీయాననము

ఓం.

# శ్రీ వల్లీ దేవ సేనా వి జయ ము

అచ్చపు జుంటితేనెపెఱ యంబుజకాంతదృశాంత క్రొత్తగా
వచ్చినకోడ లార్ద్రితరభావనిధానము శాంతభావ సం
వచ్చతురాస్యసుందరి కృపారస సాధుసుధాంబువాపి యం
చెచ్చట దేవసేన నుతులే వినిపించెను వారి కచ్చటన్

ఒకనాడు సప్తమాతృక
లు కొండలింజూడ మనసులోఁగొనిరా బో
రుకలుగఁ గైలాసాచల
నికటగ్రామముల సాధునిస్వానములై

తల్లీ! యెప్పుడు దేవసేన తనసద్మంబందుఁ గన్పించ దే
పల్లీలౌకికజీవనంబు సవరింపంబోవునో యే మహా
పల్లీనంబగు వేదకాపురము సంబాళింపఁగాఁ బోవునో
యిల్లంచున్నద టన్నవే రతివ యెట్లుండన్ గృపాసారయై

తల్లులు తెల్లఁబోయి ముఖతామరసంబులఁ గాంతిమాలఁగా
కల్లరి సౌఖ్యమా సుతుని కాపుర మే మయిపోవు నంచు లోఁ
దల్లడ మందుచుండియును దా నది పైకిని దోఁచరాని హా
సోల్లసనంబునన్ నిజతనూభవుఁ జూతు మటంచుఁ బోవుచున్

ప్రాణిధర్మంబైనఁ బాటింప దీ జాతి
యని ముక్కుపై వ్రేళ్ల నదుమువారు
ఈ దానవులబాధ యీ దేశమున కెప్డు
పోవునో యని వగపొందువారు
అన్నన్న! పురుగులకన్నఁ గనాకష్ట
మైతిమే యని దుఃఖమందువారు
ఆలించువారును బాలించువారును
లేరాయె నని మూదలించువారు

నై జనంబులు గుమిగూడి యంగలార్చు
చున్న యొకచోట మాతృకల్ చన్నచోట
కారణంబుఁ విచారింపగాఁ జనంబు
లిట్లు చెప్పిరి కన్నుల నెజ్జసెఙల

తారకాసురపతి యధికారి యొకండు
తులువ పాలించు ని ప్రాంతముల నతండు
వాని యధికారగర్వంబు వాని మదము
వానికే యవి తెలియుంగవలయు నమ్మ

హయములు పూన్పనట్టిదియు నావిరిచే నడపించునట్టిదిన్
రయ మది యింత యంచు ననరానిది యంత్రపు బండి తెచ్చి వి
స్మయ మొదవించుకోసమయి మా చిఱుపల్లియ వీథిఁ దోలె ని
ర్భయముగఁ దానిక్రిందఁబడి ప్రాణమువాసిరి కొంద ఱచ్చటన్

అందులోఁ గొనయూపిరి యాడుచుండె
నిద్దఱికి దేవసేన తా నేగుదెంచుఁ
గాచి రక్షించు నని నమ్మకంబు వారి
కిట్టు లున్నది వేల్పుల యీ ధరిత్రి

అనినన్ మాతృకలున్ గృపాగుణముచే నాందోళనంజెంది వా
రిని గాన్పించు డటన్నఁ దోకొనుచు వారింజేర్ప వార్యాంచి మ
న్చినదే యంచును దేవసేన జననీ శీఘ్రంబ యీ బాధ మా
న్చినదే మందని సేనకా దని పరిక్షీణాసుతంబొందఁగన్

కడచిన ప్రాణముల్ నిలుపఁగల్గు మహత్త్వముకూడ నున్న దా
పడఁతుక కంచు వారడుగఁ బల్లియవారలు దేవసేన మా
చెడి పరిశీర్ణమై చనిన జీవనముల్ మఱి నిల్పఁబెట్టె మా
పడిన పరిశ్రమంబు ఫలవంతముచేసెడు తల్లియుం చోగిన్

ఆమె యెచ్చట నున్నదో యామె యిచటి
వృత్త మెఱుఁగవలె నన మాతృకలు మేము
నామె చూచుటకే పోదు మామె మేమ
యామెతో నిద్దచెప్పుదు మంచు వెడలి

సేనతో నెన్నియో చెప్పఁగావలయున
యామెకోసను చూతు మనెడువారు
నాలుగైనట్టిది నాలుగా నెదు రెహ
రరయుదు మామెకై యనెడువారు
ఇన్నాళ్లు రాకుండ నెప్పుడు లేదు మ
మ్మరయ కించుక నగలార్చువారు
ఏ జగద్రక్షణాహీనకార్యభరంబు
నం దెంచు మసలునో యనెడువారు

నైన పలుగ్రామముల యందు నరిగి యరిగి
తుదకు నొకచోట నా చోట దొరకు ననెడి
మాట చెవివేసికొని యంత మాతృకలు ప్రి
యాణమైరి కుబేరదేశాంతరంబు

వలఁకుల నేత్రపర్వముగఁ బద్మనికోసగు పచ్చిముత్తియం
బులు నిలువాను కుప్పలుగఁ బోసినయట్టుల నున్న చిక్కణం
కెల బరువై తలల్ మలచు క్షేత్రములంబయి మింటఁ బైడి యాం
డంతరఁగల్ విశాలనయనంబులమణ సరిహద్దులై చనణ

పశువులకు బీడులేకుండఁ బంటచేలు
మసులుటకు వీలులేకుండ మందిరములు
మందిరము లంటు నాకాశమండలంబు
చేలు వ్యాపించెడును దిశాసీమలకును

కనుటకుఁ జేలు మేడలును గాని నిజంబుగ బుద్ధిలోపలన్
ధనము ధనమ్ముగా నయిన తత్పరసీమల నేగి నేగి యొ
వ్వనిఁ గని సేననుంగుజేచి వార్తయెఱుంగఁగ వేడినన్ గనుం
గొనరును మాటచెప్ప రిదిగో యని సెఁప్వు నాలకించరున్

జనములు గుంపుకూడి యొకచాయను బాయక శ్రద్ధధానువై
యునికియు నెవ్వరేని యెదియో విషయంబు బ్రమాణమైన దా
నిని వచియింపుచున్నకరణిన్ గని మాతృకలున్ జలచ్చలత్
జనిత కుతూహలాత్మలయి సాగిరి యా జన మున్నచోటికిన్

పదిసెంట్ల గోదుమపైరు కుప్పనువేసి
నట్లున్న కుదిమట్టమైన బొమ్మ
చేతీత చేనేతచీర పచ్చనియంచు
మెఱపునా బొమ్మపై మెలఁగుమూర్తి
పైడికాంతులతోడి ఫాలభాగమునందు
నెఱ్ఱకుంకుమపుబొట్టెసఁగు వెలుగు
నిలుచున్నతీరులో నిఖిలదానవ గర్వ
మపహరించెడు ప్రతిభాభిరామ

గున్నమామిడి పూచె నోకో యనంగ
నవవసంత మనోహరానందరేఖ
యింతి యొక్కతె మాటాడ నెల్లజనులు
మంత్రముగ్ధులవలె నిలంబడిరి చుట్టు

ఒకసంగీతము పాడుచున్నటుల ధారోత్క్షిప్రసారంబుగాన్
ఒక యాజ్ఞాపరిపాలనంబువలె నేత్రోదారకాంతిచ్ఛటన్
శుకముల్ పల్కుచు నుండగాఁ బరభృతాసుస్వానగానంబు పొం
దికగా స్పష్టములైన పల్కు లబడెన్ దీపుల్ పిసాళింపఁగన్

సహజముగ నందకత్రియ జలగహాక్షి
ఆమె చేయు నుజ్జ్వలమపన్యాస వేళఁ
గన్నుబొమ్మల చెక్కిళ్ళ కదలికయును
గనుల వెలుగును నందంబు సినుమడించు

ఒక జలవృక్షమందుఁ గుసుమోద్గమమై ధర విచ్చె గుచ్ఛమై
సకల ధరాప్రసూనమధుసారములందున మానవాళి తేం
ట్లకరణి స్నానభోజనకలాపము చేయ సమానభాగ్యమై
మొకరులు కొన్ని యేటికి గుముల్ గొని కొన్నిటి పొంద్రోలెడిన్

వేల్పునేల యిద్ది వేల్పుల యిష్టమై
నట్లు పూర్వరాజు లట్లు చనిన
దున్ని నాటి కోసికొన్నట్టి వారిదే
అంతమాత్ర మయినయట్టి చెక్క

ఎవ్వఁడు దున్నె వాని దగు నీ ధరణిం దనుజేశ్వరుండు తా
నెవ్వఁడు దున్ను వాని దని యిచ్చెను విక్రియయోగ్యమై చనన్
క్రువ్విన యాస్తులై సురలు కొందఱు దానవులైరి వారలుం
జివ్వకుఁ జొత్తురీ పెఱలజీవితముల్ కృతసేవమై చనన్

ఆ మహాదేవి మా యూరి యాడపడుచు
ఆ మహాత్ముఁడు మా యూరి యల్లుఁ డన్న
పలుకులందలి యర్థమ్ము పాడువడియె
నూరిలోఁ జెక్క యెవరిదివారి కగుట

ఒక సమష్టికుటుంబమై యున్న యూరు
వ్యష్టిబ్రదుకులుగా నయి వారు దొరలు
నీరు పాలేరు లైరి కల్పించినట్టి
భేదములు వేసఁగిపొలాన బీట్లువాఁగ

ధన మనఁగ నెట్టు లుండునో
జన మెఱుఁగరు మున్ను బ్రతుకు సారముకలిమిగ
ధనమే జీవితలక్ష్యం
బనఁగా రసహీన మయ్యె నందఱిబ్రదుకుల్

మనచదువు మానిపించెను
తనచదువుం జెప్పె నసురధారుణి ప్రజ కెం
దును క్రొత్తయొక్క వింతయు
కనఁ బ్రాతయు నొక్కరోతగా ననిపించెన్

పరిచితి కల్గినట్టి వగు భావములం దభిమాన మొప్పు నీ
పరమరహస్యముం దెలిసి పాలసు డా యసురేశ్వరుండు నా
విరియగు స్వీయవిద్య చదివించెను దేశము వానిజ్ఞానమే
పరమయథార్థ మంచు పలుపాట్లకు పాలగుచున్న దక్కటా

ఆ దితి గర్భసంభవులయందున నుత్తమధీకులైన ప్ర
హ్లాదుడు నాదిగాఁగ బరమార్థవిదుల్గల రైనగాని త
ద్వాదము లీ ధరిత్రిగలవారికి నాత్మ నెఱింగినట్లుగా
మోదముగూర్చు వెంబడిన మోహము క్రిమ్మని పెంచె చిత్రమో

వాని నెదిరించిరా యెన్ని వాఁడొసంగి
నట్టి యాస్తులు నిలచెడునట్టిలేని
భయముతోఁ బాటు నధికారపటిమ సౌఖ్య
ములును వదలఁగఁజాలని మోహ మొకటి

ఇట్టి యిరకటమునఁ బెట్టి యెల్ల వారి
ప్రాణ మానంబులను భుక్తపరచుకొనియె
తేనెపూసిన కత్తియై దితిసుతుండు
నమరతతిఁ గొంత లేలిహానములఁ జేసె

పండక వానలేక యిట భారతధాత్రిని మున్ను క్షామమై
యుండనువచ్చుఁ బండియు నహో యిట క్షామముగా నొనర్చె ను
ద్దండుడు దైత్యరాజు తనదండు విమోహితచిత్తవృత్తులై
యుండఁగ వట్టిపై మెఱుపు లూది జయించినయట్లు చూపెడున్

నీదు వేళ్లు పెట్టి నీ కన్ను పొడిపించు
తనది తప్పు లేద యన్నిన యట్లు
మనదె వేళ్లు కన్ను మనదియే యను తెల్వి
మనకు లేని మోహమును ఘటించి

శ్రమ లేక జన్మతో సంపన్నులై పుట్టి
అధికారముల నెల్ల నాచికొనుచు
తల్లిదండ్రులు నన్నదమ్ము లీ మొదలైన
ప్రేమబంధమ్ములు త్రెంచికొనుచు
కామాదులకును స్వేచ్ఛామార్గ మయినట్టి
యసురనాగరకత నలముకొనుచు
పేదవారిని మోహపెట్టగా సర్వ స
మానసిద్ధాంతంబు ముప్పికొనుచు

లోక మెల్ల లోఁగొను విద్యలోనఁ దమరు
నందె వేసిన చేతులై రక్క టకట
దేవతలుగూడ దితిజుల త్రోవఁబట్టి
యసుర పన్నిన వ్యూహంబునందుఁ జిక్కి

వందమంది పేదవారి నెత్తురు గడ్డ
కట్టి నీవు మేడ కట్టినావు
వారియసుర తీవ్రవాయువు వీవఁగా
తూలి మేడ నేలఁ గూలిపోవు

వెసభూమీప్రజదా స్వతంత్రమతియే విష్ణుస్వరూపంబుగా
నసురన్ గుత్తుక కత్తిరించు నవచక్రాంశుప్రతానంబులై
విసరత్స్వస్వసమానభావకలితోర్వీక్ వైనతేయుండు ప
క్షసమున్మీలిత తీవ్రమారుతతరంగప్రోజ్జ్వలుండై దిగుక్

అందఱకు వృత్తి చూపించునట్టి నేర్పు
నీదు రాజ్యాన వెలసిన నీతిలేదు
దేహాళికి బిచ్చగాఁ డడుగుదెంచె నేని
లేచి పొమ్మని పొరఁద్రోలెదరు గాని

వృత్తులు సర్వనాశ మొనరించిన దైత్యుఁడు ప్రాణులెల్ల నే
పొత్తులఁ గుక్షి నింపుకొను పోడిమి చూపను లేక సంఘముఁ
గ్రొత్తగఁ దీర్తు నంచు నదిగో యిదిగో యని ప్రేళ్ళు సూపుచు
న్వృత్తి మెలంగఁగా నసుర వేఁడుకుపట్టినవారు మెచ్చుచున్

యంత్రముల చేత సర్వకార్యములు చాల
శీఘ్రముగ సల్పబడు నని శిష్టకాల
మఖిల జనములతోఁ బాటు యంత్రములకు
కూడ విశ్రాంతి యది సమకూడు నందు

తక్కిన కాల మేమి యగు ధ్యానము చేయుచుఁ గూరుచుందురో
అక్కట దైవమున్న దని యాత్మయు నున్న దటంచు నమ్మినాఁ
డొక్కఁడు లేడు సంఘమె మహోజ్జ్వలమౌ పరమార్థమైన యీ
దిక్కున శిష్టకాలమునఁ దెత్తురు జ్ఞానము సంఘవృద్ధికై

ఈ రాక్షససంఘంబున
నారాతా నొక్కజీవి దగు భావిశుభ
ప్రారంభ చింత లే దది
వారు బ్రదుకుచున్న బ్రదుకె పరమార్థమునన్

సువ్యవస్థిత సంఘంబు వొచ్చి చెఱిపి
రమే భవిష్యత్తునవౌ స్వర్గసృష్టి చేయు
వారలై వర్తమానంబు ప్రళయకాల
ఝంఝగా మార్చుచున్నా రసాధుజనులు

బ్రదికియున్నవారి బ్రదు కెట్టు లన్నట్టి
ప్రశ్న లేదు సుంత భావిప్రజల
జీవితమ్ము గూర్చి చింతతో నడతుగ
చిత్ర మైనయట్టి జీవవితతి

అధికారము చేయుటయే
పరిపాలనలక్ష్యంబు మఱుగుపరతురు దానిఁ
వ్యథ భావిప్రజలకోసము
పరిపాగుణము హృదయవీధి కూలంకషమై

సువ్యవస్థిత సంఘంబు సుఖముకొఱకు
సుఖము దేనికి ననుభవించుటకు నెవ్వఁ
డిచట యనుభోక్త జీవుఁడో యెవఁడు వాఁడు
నాతనిస్వరూప మెట్టి దెట్లనుభవించు

అనుభవించిన నతఁడు స్వయ[illegible]వ యగు
అనుభవించెడునట్టి నైచ్యం[illegible]ల
యిట్టిమీమాంస చేయక [illegible]ఁడుగాని
కాంచునే నిత్యమగు సాంఘికవ్యవస్థ

కొనకొని సర్వదా సుఖము కోరుట జీవుని లక్షణంబుగా
ధనము కలట్టివాఁడు మఱి తా ధనహీనుఁడుకూడ జీవులై
యనుజులు నగ్రజాతులునునై యొక రొక్క రొక ళ్ళొకళ్ళకీ
దనుజుని పంపకంబునకు దవ్వయిపోయె సుఖానుభూతికిన్

ఆరు మొగముల వేల్పు తా నసురరాజు
రేపు సమయుద్ధమందు దోరించఁగలడు
మరల సురరాజు తొల్లింటిమాదిరిగనె
పరువు లెత్తించును బాలాలపై మొయిళ్ళు

ఈలోపున మీ రందఱు
మేలుకొనుడు పంచి యిందు మీ మీ పొలముల్
కాలోపహతులు పేదల
కా లోపము పూర్తిచేయుఁ డమరేశునకున్

అంత నూరక యుండిన యామె విభృత
శాంతసుకుమార వదనాంబుజాతమందు
నుపరమించిన శారదయున్ రమించు
చున్నయది సర్వమంగళయున్ జెలంగ

పిద్దెలు మేడలున్ బొలము మే మని మే మని గుంపుగూడి తా
మిద్ది యిదంచుఁ దీసికొను డీయని యిచ్చిరి తత్సమాగతుల్
గద్దియఁ గూరుచుండి యసుఖంబుగ నాయమయున్ శివార్పణం
బిద్ది యిదంచు వాక్కులననే గ్రహియించెను సర్వసంపదల్

అదియుఁ గోడలిఁ గాంచెడి నదను కాద
టంచు వాత్సిక లేగి నారంత నంత
ముసరుకొని వచ్చుచున్నట్టి మోహజలధి
పెద్ద కెరటాల నొడ్డున విడుచుకొనియె

తీవ్రభావంబు త్యజియించి దేహమునకుఁ
దాఁకినంతన సుఖమయి తమ్మిపూవు
చుట్టము వెలుంగులుంగరా ల్చుట్టికొనుచు
పండిన పొలాలమీఁదను బారులాడె

ఇది శ్రుతుపరాజయ మను
తృతీయాననము

ఓం.

# శ్రీ వల్లీ దేవ సేనా విజయము

ఆ రీతిఁ బలుచోట్ల కేగి సుకుమారాలాపహేతుప్రితా
నారూఢోక్తుల శాంతవాక్కుల ధనాఢ్యశ్రేణి క్షేత్రంబులన్
ధారాపేతముగాఁగఁ జేతఁగొనుచున్ దానంబుగా శాంత ధీ
శూరత్వాకృతి పేదవారలకు నిచ్చున్ బిల్చి నద్దిక్కులన్

మాసిపోయిన ప్రాతమగ్గాల నెలకొల్పి
పరమేశ్వరుని దిగంబరత మాన్పు
మూలఁబెట్టిన రాట్నముల బైట తీయించి
విదియచందురునకు విందుచేయు
పునరుద్ధరించి చెప్పులను గుట్టెడు వృత్తి
మాతంగకన్యకు మన్నన యిడు
బీళ్ళ కాలువగట్ల వేలముల్ మాన్పించి
నందీశ్వరునకు నానంద మిచ్చు

కుంభశారదపృథ్వ్యాదులు కూర్చి నుడల
విఘ్ననాయకునకు నుడి సీగభద్రి
దేవునకు సమకూర్చును తృప్తి సేన
మెట్టినింటికి వెలుఁగయి మెలఁగుచుండి

మత్తిలి దైత్యనిర్మిత సమాజమునందు ధనాధికారముల్
గుత్తకుఁగొన్న పాలసులు కొందఱు మోహముగొన్న కొందఱు
వ్యాత్తుగ దేవసేన జగమెల్ల సనాగరకంబు సేయఁగా
నెత్తిన యెత్తటంచు వచియించి పరిహాసము బిట్టు చేయుచున్

అగ్నిశిఖాభమౌ నామెశీలమునకు
గృహ మంట దను ధూమ రేఖ చెప్పి
అంబుజాప్తు వెలుంగు లామె మాటలకుఁ గా
ఠిన్య మున్నట్టి వేడిమిని జెప్పి
వైదికం బయిన తద్వాదంబునకు పాఁత
యవి మాట లన్న లౌక్యంబు చెప్పి
యచ్చవెన్నెలవోని యా పరిసన్నాత్మకు
తరుజాటిల్య శైత్యంబు చెప్పి

అమృతమయమైన నిత్యరసాత్మకును ద
దీయ పూర్వజనుస్సంస్కృతికిని సుంత
యైన సంబంధ మొలయునియట్టివారు
మచ్చరింతురు సేనతోఁ గచ్చెకట్టి

ఈ దేవాసురభావయుద్ధ మిదియుఁ సృష్ట్యాది సృష్ట్యంత మం
చాదిఁ లోన నెలుంగు సేన యొకనాఁ డా దిక్కునఁ మొగ్గ నే
డీ దిక్కుంబడి మొగ్గుచూపు నని నా రే మన్ననుంగాన కా
నీ దైవం బెటు లున్నదో యనుచుఁ దా నెంచుం గ్రియాకష్టయై

దైత్యభావంబును యథార్థతరకు మొకకు
దాని కొకకుటి దగవు వితండ జల్ప
ములకు దగ్గరిబంధువు మోహబుద్ధ
సేన వారియందునఁ ద్యజించినది తగవు

కొందఱు దైత్యభావమునకుఁ మును దాసులు దేవసేన వా
క్యేందుమనోజ్ఞచంద్రికల హృన్నవకైరవముల్ ప్రసన్న భా
వేందిరఁ బొంది దైత్యుఁ డొడవించిన సర్వము దుష్టమం చొగిఁ
నిందపొనర్చుచుం బరిగణింపక యుండఁగ దాని లేశముఁ

తిరుగుచుండఁగ నొకవాడు దేవసేన
వారిలోఁ గొందరఁ బిల్చి వత్సలత్వ
మెనయఁగా బుజ్జగించుచు నిట్టు లనియె
మందహాసంబు సెలవున నందగింప

పృథివిని సర్వదుష్టమయి యేదియు లేద తలంచి చూడఁగా
నధికము మంచి దైనయెడ నయ్యది మంచిది యందు మందులో
నధికము చెడ్డ దైనయెడ నయ్యది చెడ్డది యందు మందుచే
శిథిలముగాగ సర్వమును జేయఁగరా దది యెప్పుడైననుఁ

హరి తన చక్రధార నఖిలాసురులన్ మడియించలేడె తా
నరనిముసంబులోన నెప్పుడైనను తా నటు లాచరించెనే
యరయఁగ వేల్పులైనను నహంకృతిచే మితిమీరిపోయినన్
ధరణికిఁ జేటుగాదె యది దానవభావము వేఱ యున్నదే

సేనలు తెచ్చి శీఘ్రముగఁ జేర్పఁగ నావిరితో మహోత్వరా
యానము చేసి యందఱు ప్రయాణముచేయఁగ వీలు చూపి సొం
తానికి డబ్బుచేసికొను దానవుఁ డయ్యది బండి దోసమా
దేనినిగాని   దుకొనుతీరున నున్నవి మంచి చెడ్డలున్

కాశికిని బోవనగు వర్తకంబు సేయ
వచ్చు బంధువులను జూడవచ్చుఁ బోయి
శీఘ్రముగ వేయిపనులను చేయవచ్చు
ధూమశకటంబు గాదనిత్రోయ నగునె

ఒక యిది యేమిటి దానవుఁ
డొకవంద జగత్ప్రయోజనోపాయంబుల్
ప్రకటితమహిమము లాశ్చ
ర్యకరంబులు చేసి వాసినా? కా దనుటల్

ఓయీ! భారతదేశ పూర్వఋషు లెట్లో దివ్య మధ్యాత్మవి
ద్యాయోగంబున సంఘజీవన ప్రశాంతార్థ్యంబులన్ లోకవి
ద్యాయోగంబునయందునన్ బ్రకృతిశాస్త్రప్రౌఢమార్గానదై
తేయప్రాజిత లట్లు సూక్ష్మధిషణా దీవ్యత్ప్రియాపండితుల్

మయుఁ డసు శంబరుండు మరి రావణుం డెంత
యెంత పండితులు నహీనమతులు
నంతకంటెఁ గూడ సాధువిదులు మహా
మహిము లనుట రిత్తమాట కాదు

కడు ననంతయుగంబులుగాఁ జెలంగు
ధాత్రి యిది యిన్ని యొన్నటిదానిగాఁగఁ
జెప్పి పరిలిదియుఁ గ్రొత్తగా సృష్టిచేయఁ
దమకు మించినదాని కెత్తెదరు వారు

కొన్ని తపస్సుచేతఁ గనుగొనఁగునట్టివి జీవధర్మముల్
కొన్నిటిఁ దెల్విచేఁ దెలిసికొనఁగునట్టివి శీలధర్మముల్
కొన్నిటఁ జేసిచూచి కనుగొనఁగునట్టివి లోకమందుఁ దా
మన్నిఁటి నొక్క-సృష్టిఁ గను టాసురమానసవృత్తి యయ్యెడున్

ఎన్నవఁ డిప్పుగాఁడె యుగుఁ బౌరుఁడు దానవరాజ్యమందు నా
సన్నములైన సర్వసుఖసాధనసంతతిలాభ మెల్ల సం
పన్నులకే యనం దసురవర్గము చేరును వానిదే సమ
స్త్రోన్నతి పేదవాఁ డొకఁడుఁ బుట్టినగట్టుక యూగులాడెడున్

బిచ్చ మెత్తుట తప్ప జీవించుత్రోవ
చూపఁగాలేము రాజన్న శూరవరాళి
వాని వ్యూహమ్ములో నెంతవరకు నీవు
చొత్తువో యంతగా నీవు శూరుఁ డగుదు

వాఁడు సంఘమ్మునందు దైవంబునందు
జీవ విషయంబునందునఁ జేసినట్టి
మార్పు లిహలౌకికార్థసంపాదకములు
పారలౌకికసంపత్తి బహిరవెట్టు

గృహ్యముల్ శ్రౌతముల్ విధుల్ కేవలముగ
ధర్మ మాచార మిచట సంధానపఱచు
మట్టి కాదాయె దేశంబు మనుజు లన్న
మట్టి యవుదురయేమి ధర్మంబువదలి

అందఱును జీవులే భేద మనుచు వేద
మేని భేదంబు తనువులయందుఁ గలదు
ఇష్టములయందునను మనోవృత్తులందు
కలదు చివరకు మాటలోపలనుగూడ

పుట్టుకఁ బెంపకంబునను బొందు గుణంబులు మానవాళిలోఁ
బుట్టుకలోనిదే గుణము పొందెడు నేడు తిరాల మారుపా
యిట్టుల మార్పుచేసి వెలయించిన లోకము నేకబుద్ధిగాఁ
బట్టెద మన్న సాధ్య మను పల్కటు లుంచిన సర్వముక్తికా

అవియె కావు తినెడు నాహారమునఁగూడ
గుణము సంక్రమించు జనులయందు
నఖిలధాత్రి దొరకు నాహారములయందు
నొక్కగుణమె తెచ్చి యుంతు రెట్లు

నమ్మిక మేము పెంపకమునన్ దన పుట్టుకచేతఁ బూర్వ జ
న్మమ్ములఁజేయు కర్మవలనన్ మఱి కాలపుముద్రచేత గా
జ్యమ్మును జేయువారిదగు నాద్మతిఁ బోక్ష్మహానంబు చేత రూ
పమ్మున బొందు నీ సకలభావములున్ గడుఁ జంచలంబులై

ఇది వేయిమార్గములుగాఁ
గదలిక గల జగమునొక్క-కదలిక యే యా
స్పదముగ నిజమును నెవ రెఱుఁ
గెదరో వ్యర్థప్రియత్నకృద్ధీశాలుల్

ఎచట మొదలుపెట్టె నచటు తా నెట్టిదో
తెలియ సులభముగను దేలిపోవు
పడినయట్టిచోటు విడిచి యూ రెల్లను
విడతలుగను బోయి వెదకినట్లు

ఇంతకు నేను చెప్పునది యేమి యనంగను నాత్మవస్తువున్
చింతనచేయ మోహమునుజెందకు మెప్పుడు నారియందు వా
రింతకు మానవాభ్యుదయహేతుక లౌకికసౌఖ్యసంతతుల్
సంతనపెట్టఁ గన్గొనిన సాధనసంతతి పీడఁబోనుమీ

వీరు కన్గొన్న సాధనవితతియెల్లఁ
బూర్వఋషు లెఱింగిన సౌఖ్యములును గలదు
ధనము కావలె వానిఁ బేదలకుఁగూడ
నందుబాటున నుంచగా నద్ది యెట్లు

ఇది లక్ష సూత్రముల ముడి
బ్రియ కనఁగా దార మొక్కఁడు వదలిన నైనక
పదిలమ్ము చెడును జివికిన
పది వానికి నుట్టి త్రెంపఁ బొల్పడెద రహహో

ఈశ్వరానుగ్రహము చేత నింతవరకు
మీను భారతధర్మంబుమీఁద బుద్ధి
నిలచినది ధర్మములు సుఖంబులఁ ద్యజింప
నేటికి గృహస్థులైనవా రెవరుగాని

పూవు పరిమళించుఁ బుట్టగానే యనం
గను బూర్వజన్మసంస్కారరేఖ
ఆ వాడచిలుకయు నా వాడపలుకులే
పలుకు నన్నయది పెంపకము గుణము
ఒకవిత్తు వేసిన నొక చెట్టు మొలచునా
యన్నది రక్తగుణాతిశయము
అాయ నింగువకట్టినట్టి గుడ్డ యనంగ
స్వల్పవిద్యాగంధపాటవంబు

పత్రికృతి యెంతటి యపరిహార్యంబొ చెప్ప
నీ మహావాక్యములు శాస్త్రమింతకంటెఁ
జెప్ప దెక్కువ యన్నింటిఁ జేర్చి సాధు
మార్గమున నేగు టొకఁడె ధర్మంపుటిక్క

పడినచోటనే వెదకికోవలయు నన్న
మాట నిధనంబు మేల్స్వధర్మమున ననుట
అల స్వధర్మ మనంగఁ బైయర్థమెల్ల
నంచు వచియించిఁ 'సేన' పంపించె వారి

ఇది శత్రుసంపద్గ్రహణ మను
చతుర్థాననము

ఓం.

# శ్రీ వల్లీ దేవ సేనా విజయము

జగ మెల్ల దేవసేనా
నుగమై దైతేయకృత వినాశనసుఖముల్
తగ నాలుకొలిపి ముక్తికి
సుగమం బగు బ్రదుకుతెరువు శుద్ధపఱచుచుఁ

బ్రదుకుటరే యొక్క పరమార్థ మైనట్టి
విద్యలోఁ బరమార్థవిద్య కలిపి
ధనముతో పాటు సత్యమ్మును ధర్మంబు
బ్రదుకుపద్ధతియందుఁ బాదుకొలిపి
నేటి నందుబాటులోనికిఁ దెచ్చి పేద వా
రికిఁగూడ దైతేయకృత సుఖములు
చెదలుపట్టించిన సిద్ధాంతములలోని
మేలిమియంతయుఁ గేలుకొలిపి

స్వర్గ సుఖమైన స్వర్గంబు సంతరింప
నాశ లుడిగినయట్టి దైత్యపతి యింక
మనకు లాభంబు లేదని చనియె నింత
కంటెను శ్మశానమే లాభకారి యనుచు

తగినంత విశ్రాంతి ధాత్రీజనుల కెల్ల
చేకూర్ప యంత్రముల్ స్వీకరించి
భూప్రజ సోమరిపోతులు కానంత
వరకును యంత్రముల్ పరిహరించి
విశ్రాంతికాలాన విద్యాసమార్జనో
పాయంబు లన్నియుఁ బదిలపఱచి
అల్పసంస్కారుల నల్పబుద్ధుల రాజ్య
పరిపాలనమునుండి బహిరవెట్టి

వ్యయము లేకుండ ధారుణీప్రజ కెల్ల
నెల్ల యెడల విద్యాసార మెఱుఁగఁ జేసి
స్వర్గ సుఖమైన స్వర్గంబు సంతరింపఁ
దాను తనయూరి కేగెను దైత్యరాజు

పల్లెలతోడి సంబాధంబు చెడకుండ
నడవిలో నొక పల్లెయందు నునుచు
నడవి పూచినవేళ నాపూతపై సన్న
లేతవెన్నెల చెంగలించు వేళ

మలయాచలానిలంబులు దేవసేనాల
కంబుల వ్యాజాన కదలు వేళ
దైతేయజనిత బాధాపవృత్తి సమాగ
తానందరేఖా విహారవేళ

స్వామి దేవసేనప్రక్కన కూర్చుండి
ఆమె సన్నపైటయందు నున్న
రెండుతేంట్లలోన నొండు గోటను మీట
సేనచేయి స్వామిచేయి కలిసె

అది చివురాకుబాకుదారహస్తమునందలి యల్లెత్రాటి తే
టి దరహాసోగ్రకాహళము తేవను టంగున మ్రోసెఁ గానలోఁ
గదలిక పుట్టి లేఁజివురుగగ్గుకు దగ్గరనుండి శౌర్యమె
త్తి దెసలఁ గ్రమ్మె భావజుని తేజము మాసిన సర్వసేనలున్

ఆకసంబున వ్రాలి యొయ్యారముగను
తీయవెన్నెలదారాలు తీయుచుండి
చెక్కుటద్దాలపేడల చెలువు గూర్చి
చానయందునఁ బొడ్డిచెను చందమామ

ఇద్దఱును డస్సి నిదురించి యేదొవేళ
మేలుకొని మేలుకొననట్టివేళ స్వామి
లేమ చెక్కిళ్ళమీఁద వెల్లి యటంచు
నూదె వెచ్చనియూరుపు పాదుకొలిపి

మెలఁకువ వచ్చిరాని సొక్కు మేలిసుఖంబగు నిద్ర మాను క
న్నులఁబడి యూగులాడఁగఁ దనూగతమై యలసత్వ మొప్పలో
పల నొకతేలు నంటఁబొడువంగనె వెంటనె దద్దరిల్లి వి
హ్వాలగతి లేచినట్లు జలజాయతలోచన లేచి నిల్వఁగా

లలన విచాలనంబున మెలంకువవచ్చెను స్వామికిన్ సితో
త్పలనయనావిలోచనపదంబున నెఱ్ఱనిసంజ చూచి చిం
దులు సవరించుకొంచుఁ దన దోవతికొంగులు మూటకట్టి యం
జలఁ బటి లేచిచూచెన యుషఃప్రతిరక్తిమ కాకపోవుటల్

తెల్లగా నిలుచున్నది వల్లి కాదు
నెఱ్ఱగా నున్నయది తూర్పుటెఱుపు కాదు
తెలివివచ్చిన స్వామియు దేవసేన
పాదముల వ్రాలి యొకక్షమాపణను గోరె

తొలఁగి నిలంబడెన్ సజలతోయజలోచన స్వామి లేచి క
న్నుల నపరాధమంతయును నూల్కొన కంపన మందుచున్న దో
సిలి యిడి యాననంబు చిఱుచెమ్మట పోయఁగ సేనచే · వే
ళ్ళలు గొను సాహసంబునకు లోగనిగుండయతోడి నిట్లనెన్

తోయజపత్రసుందర మఘుద్రవలోచన! నిన్ను హేమవ
ల్లీ యనఁబోయి వల్లి యనుకే యిట నా యొనరించు తప్పు త
ప్పే' యని యేమొ తొంటివలె నిప్పుడు నే బలవన్నిబద్ధ బా
హాయుతదేహఁ జేయుటకు నైనను జంకెదనే జగన్నుతా

ఎఱవాగు హొంచ్నుకను తా
మర మరలింతు నవనీతమానస! యసు రే
శ్వరు తప్పు క్షమింతు హృదీ
శ్వరు తప్పు క్షమించలేవె సన్నీతినిధీ

ఎఱుపుకంటియాఁడు విఱువురే జంకించు
కేలుపూని నలుగఁ జేల బూని
చెమటబొట్టు లున్న చిబుకంబు పూని యో
చెలియ; నినుఁ బ్రసన్నఁ జేసికొందు

కనుగొని దేనసేవకడగంటను నీటెన్ని గోటమీటి యి
ట్లనెఁ బ్రభు! లేదు నీదుదెస నల్పము దోసము దోసమెల్ల నా
దని యెద భర్తకై యడిగినప్పుడు బ్రహ్మను శూరుఁ డంచు వా
యిని జనుదెంచె నక్కట మదేకమనస్కుఁ డటంచుఁ గోరకన్

మూఁడులోకములకు మూలకందంబైన
యత్తగారు కలుగ నమర గంగ
మరియు వచ్చె నింట మాగినగుణ మిది
తెలిసి తెలిసి నేన డిగితి నిందు

అందుకుఁ గాదుగాని ప్రభువా! నను నీ పనిమీఁద బొమ్మటం
చుం దితిజేంద్రు మాయ తొలచుంబనిమీఁద విదేమిన్యాయ మా
నందనికేతనాస్య యిది నమ్మఁగఁ జాలకపోతి నెవ్వరో
కొందఱు నాకుఁ జెప్పినను ఘోరముగా నిటు సేయు టుందునా

నే నేమొ లేచివచ్చిన
దానిన యన్నిరోదగు మఱియుఁ దగినవిధానన్
దానికి జరిగిన దండూరు
నే నే మొగమునను దండ్రియింటికిఁ బోదున్

దితిసుతు బాధలందు ననుఁ దేఁకువఁజూచెను లోక మిప్పు డా
దితిసుతు బాధ లేనితఱి దేశము భోగపరంపరా త్వరా
మతి సుఖశాంతనీతి మృదుమార్గము పట్టదు పోయి కానలో
బ్రతికెద లోపలన్ నిను శివప్రతిరూపము వెల్గఁ జేయుచున్

ఇప్పటికి నైహికంబున నిప్పు పెట్టి
తకట వైరాగ్యమునకును నడ్డు రాకు
ఘనుచుఁ జను సేనమార్గమునందుఁ దోలఁగె
స్వామి బహుదుఃఖభారవిషణ్ణుఁ డగుచు

ఆ వల్లి యెవ్వ రాయమ
సేవాభావంబుయొక్క స్థితి యెట్టిది తా
నో వెడలివచ్చె స్వామికి
నా వనిత సుఖంబుగాగ్నునా యను చింతన్

ఆమె శబరకన్య యగుటచేఁ దా నేగి
నవరగూడెములకు జలజనేత
అచట లేదటంచు నఖిలపల్లీపక్క-
ణముల కేగి గౌరవములఁ గొంచు

ఎల్లెడ వల్లియొక్క నుతులే వినిపించెను వల్లి యిందిరా
వల్లి జగద్భ్రమార్ఘురిణి వంశైన శ్రీకనువిద్యుదాభ సం
వల్లలితాబ్జనేత్రి సుమనూసముపాత్తకమాప్రసాదితా
పల్లవితాఖిలప్రజ కృపామధుసారణి యంచునంగదన్

తొలి రచించిన మార్గముల్ సకలవృత్తుల్ విద్యుదుద్యన్మహో
జ్జ్వల యంత్రంబుల సాయమై బహుళవస్త్రంబుల్ పదార్థాళి బా
హులఁ బండించిన వెల్లెడన్ కొఱతలేకుండంగ విశ్రాంతివే
ళల భూమీప్రజ జ్ఞానవాపికల వాలాయంబు నోలాడుచున్

ఇంటింటం గన సేన, సేన పదసామీప్యంబునన్ వల్లియున్
జంటల్ గాగను రమ్యచిత్రములు భాస్వద్వర్ణముల్ నిల్పి వా
ల్గంటుల్ శ్రీమధురాకృతుల్ తనకు సేఁగా మంగళారాత్రికల్
వెంటన్ వెంటనె వల్లిదేవి నుతులన్ వించున్ హసన్నేత్రయై

ఏ పని చేసినన్ దొలుత నిందుశిఖాపమఫాలభాగ కా
ర్యాపతితంబగా శశికళాభరణున్ నుతియించి భక్తితో
నాపయి దేవసేన నుతులాడి యనంతర కార్యనిశ్చయ
వ్యాపృతబుద్ధియైరనుచు వల్లి జనంబులు చెప్పఁ జెప్పఁగన్

కొంచెము మాత్సర్యమ్ము హ
రించిన సేనకును నామె శ్రీవల్లిన్ భ
క్త్యంచితఁ గనుగొనవలె నని
పించెను మ్మదుగుగాఁగఁ బ్రీతి రహించన్

పనితంబేగతిఁ గూడు గుడ్డలకు లోపం బింత లేకుండఁ జే
సెను మున్ దాను ధరాజనాళికి మరిన్ శ్రీవల్లి సేవలన్ వినూ
తన శాంతాకృతులం బ్రసన్నమతులన్ దత్త్వాత్మలం గాంచుచున్
జని తా వేయు పునాదిపైనను మహాసౌధంబు గన్నట్టులన్

పొలతుక వల్లియొక్కఁ నుతి బోదెలు కుల్యలు సన్నపంట కా
ల్వలు చిఱుతూములున్ నదులవంతెన లాపగ వాగు నాన క
ట్టలు పెనుతూములున్ జలవిడంబన లంతటఁ జీలుచున్న యో
రలబడి లక్షలాది యెకరాలకుఁ బాఱుదలల్ విచిత్రమై

నిరతంబు నెండఁగోఁ జరియించుటం జేసి
ముదురు తేలిన నల్లమోముతమ్మి
బహుదూరము దినమ్ము స్వారి చేయుటచేసి
కఠినీకృతంబైన కాయవల్లి
ఎల్లచోఁ బనులు చేయించుట కనువుగా
నధికారబావాబ్ధులైన కనులు
పనివడ్డచో సిద్ధపడుటకు వీలుగా
నొడల నత్తుకయున్న యుడుపు లొప్ప

పూని గజసారణీ వినిర్మాణ మొకటి
పర్యవేక్షించుచున్నట్టి వల్లిఁ జూచె
సర్వదేశంబు నచ్చటఁ జానయాజ్ఞ
చేసెఁ బా[illegible]ఁబడుచున్న చెలువు తోఁచె

బొమ్మలం గోనఁ గన్గొనిన పోలిక చాలిక గుర్తుపట్టి యం
దమ్ముగ నేత్రయుగ్మమున దర్పము వెంటనె మారిపోయి య
బ్రమ్ముగ వచ్చి సేన పదపద్మములందున వ్రాలె వల్లి యా
ర్ద్రమ్మగు నేత్రముల్ సజలతామరసంబులఁ గ్రేణి సేయఁగన్

తిగిచి కౌగింటఁ బూనిన దేవసేన
కౌఁగిటనె పిల్లువినయంబు క్రమ్ముకొనుచు
వ్రేలుచుండిన చెల్లెలివిధము చూచి
విమలహృదయంబునన్ సేన వెన్నయయ్యె

ఈమె సన్యాసిని యామె సంసారిణి
కట్టినవంతెన కౌగిలింత
ఈమె దేశికమూర్తి యామెయు శిష్యురా
ల్పరమ విద్యాసంధి వారిప్రేమ
ఈమె పునాది తా నామెసౌధము భావ
ములు వారి వన్యోన్యపోషకములు
ఆమె తత్త్వము తన్మయత యీమె స్వర్గ మ
ర్త్యముల కూడలిసమాగమము వారి

దనఁగఁ జూచెడివారికి నబ్బురముగఁ
దోఁచె గుండియలందున దుడుకు తగ్గ
దూములం జెంగలించుచు దూఁకుచున్న
నీర మొక కొంతదూరాన నిలచి పాఱె

ఇది నిరంతరాభ్యుదయ మను
పం చ మా న న ము

ఓం.

# శ్రీ వల్లీదేవసేనావిజయము

ఆమెయిఁ దారహీనలు సితాసితవర్ణసమాన వృత్తులున్
స్వామిని జేరఁగాఁ జనిరి ద్వాదశసామిని మీలితాక్షు ను
దామ ఋతుప్రభాశబలితప్రణయానతచారువక్త్రి ని
త్యామృతవృత్తిచే ననము నంచదహీనచలత్తనూచ్ఛవిన్

స్వామిని జూచినప్పటికి సారసలోచన లిద్దఱున్ మరే
మో మది పూర్వ మొకర్తురగ నున్కియుఁ బోయిన దిద్ద అద్దఱై
స్వామిని వేఱువేఱుగనె భావనచేసిరి వారియూహ శే
ఖామితమూర్తియై పతియుఁ గన్పడె మాఱిస్పడి వారు చూడఁగన్

తలపయిఁ జిన్నిచంద్రునిఁ దాల్చిన సామికి బాజుబొందుగా
దెలి రుదురాకపేరుగను దిన్నని పెంజెవితమ్మ గన్నెకుం
డలముగ నాదిదేవు జఘనంబున జుట్టిన పట్టుపట్టుగా
సలఘువు దేవసేననయనాబ్జములందున స్వామి కన్పడెన్

లీలగఁ జేయమీఁదఁ బవళించిన సామికి మేల్తలాడగా
వీలుగ నెందునెం దొరపు వెట్టక యుండెను నందు నందు ను
య్యాలల నూచు పట్టుపరపై కనిపించెను పల్లికంటికిన్
నీలఘనాకార మేఘ కమనీయతనూచ్ఛవియైన సామికిన్

స్వామి వారిని గాంచి యాశ్చర్యమందెఁ
జెలువ లిద్దఱును వింత చెలిమిఁ గలిమిఁ
జెలిమి సాగుచునుండిని సేన యప్పు
డంతకోపమ్ము నందుట యబ్బుర మని

ఈసును బాసి చెల్మిమెయి నిద్దఱు భార్యలు నుండఁజేసి యా
ల్హాసముశోభమైన రతిసౌఖ్యములోపము నెంచి గాఢచిం
తాసముపేతచిత్తమునఁ దామరసాక్షులఁ బల్కరింపకన్
లో సుడివోంద స్వామియుఁ దలోదరులున్ బతిచిత్తభీతలై

మరియు నిపుడు స్వామిసన్నన లందెడు
వేళ కాదటంచు వెళ్ళుచుండ
స్వామి సేనజఘనవైభవం బారసి
యరిగి యామెచేల నాహరింప

వెనుదిరిగిఁ చూచె వల్లియుఁ
గనుగోనలయందు నిప్పుకణములు సెదరన్
తన కనులు మొయిలుజతగా
తన నడకయు ఝంఝుగాఁగఁ దా నడచి చనెన్

లలనయు రక్తి లేని కనులంగని స్వామిని దేవసేన కొంద
లపడి స్వామి యొందు చిఱునవ్వున నాయమ చేల వీడె ను
త్పలదళ నేత్రయుం బతిపదద్వయి మ్రొక్కి ప్రశాంత వాహిని
సలలిత సాధుయానమున సాగి చనన్ గిరిగహ్వరంబులన్

అకవచ శాంతిమైన కుసుమాయుధుపైని నరోష సేన శా
సకుఁ జలి వాన లెండల దినంబులు సాధుతపంబు సేయఁగా
సుకములకోర్కి లేనిదగు సుస్థితిఁ గన్నులు మూసి గుండె లో
పలి యొకమూర్తి కన్బొమలపై నిలిపెన్ ప్రహసత్ప్రదాస్యమున్

ఆగతి దేవసేన తన నాత్మనిలీనుఁడు స్వామి శాబర
స్త్రీగుణభావనా మధురచిత్తుఁడు నామెఁ బ్రసన్నుఁ జేసికోఁ
గా గణుతించి యామె వెదుకన్ బహుదేశము లేగ వల్లి తా
నేగినచోటి కేగక హృదీశ్వరు వేయెలయించుచుం జనెన్

ఏ యూరి కేగిన నా యూరఁ దను పరి
శ్రమలను రక్షింప నమరిన దని
ఏ పొల మ్మేగిన నా పొలమ్మున వారి
సారణీపంక్తులు సాకిన దని
ఏ యేరు చూచిన నా యేటిపై సేతు
బంధమ్ములను జతపరచిన దని
ఏ కోన కేగిన నా కోనలో విద్యు
దుదితప్రణాళికల్ మొదపిన దని

వల్లి జగదేకరక్షణోత్ఫుల్లమతిని
జెప్పఁ జొచ్చిరి నాలుగు సీమలందు
నెచటి కేగిన నిప్పుడే యేగిన దని
వల్లియునినను గాదు శ్రీవల్లి యండ్రు

అగ్నిభయంబు మాయఁగ శిలాగృహములు
కట్టించుటకుఁ బదకముల నెత్తె
నీటియెద్దడిపోవ నిలువులు త్రవ్వించె
బెట్టయూళ్ళలను వాపీచయంబు
సమయాన సుఖముగాఁ జనవిశాలమ్ముగా
బాటలన్నియును నేర్పాటుచేసె
మురికిపట్టణవాడల నిరుకువీధులను బా
లింపఁ గ్రొత్తవి ప్రణాళికలు వేసె

అధికముగ దైత్యపతి తనయాజ్ఞ నెఱపఁ
బెట్టిన విభేదములను మాన్పించె వల్లి
వివిధసృష్టిరహస్యముల్ విప్పి చెప్పి
చేకొను మనస్సులను విమలీకరించి

అందఱు జీవులే మఱియు నందఱ కున్నవి క్షుత్పిపాస
యందఱు దుఃఖముఁ సుఖము నందెద రందఱు స్త్రీగతస్పృహాలా
స్పందితవృత్తులే పయిని వ్యాధులు నాథులు బిట్టుమృత్యువుల్
కొందఱ కుండి లేపటవె కొందఱ కిప్డి సమానధర్మముల్

మరియును జూడ మానవసమాజమునం దసమానధర్మముల్
నెఱయును సర్వదా కళలనేరుపులందు బలాబలంబులం
బరువడిఁ జిత్తవృత్తులను వచ్చెడి విద్యలయందు దా నహం
కరణము స్వార్థముల్ జననికాయమునందుఁ బ్రవృత్తిహేతువై

కూర్మి సమానలక్షణము కోరి విచారణ చేసినన్ దనూ
ధర్మములందు భేదసముదాయము చింతనచేసినన్ మనో
ధర్మములందు రెండు నిరుదారులఁ జక్కఁగ నేర్పరించి యీ
మర్మము దాచ కేలవలె తన్మపతి జీవిసుఖం బదైత్యుఁడై

పిడుగునకును బియ్యమునకు
నెడపక సమకూర్పరా దాకేమంత్రమ్ముల్
బిడుగడచును బియ్యమ్మో
యొడలిసి రక్షించు మన సమాజో! పిడుగుసుడీ!

బ్రిమయగఁ జేసి యందఱును బైకివిరాగను జీవితావకా
శములు సమానమం చనినఁ జాలు నొకో యధికార మెల్ల ను
త్తము లనుకొన్న వారికె కదా సమకూడుట జీవితావకా
శములు సమానమం చని వెసం గికురించుట యేలో దీనులన్

కర్మ యున్నది జీవుఁడు కలఁడు తదను
గుణముగా సాగు సుఖదుఃఖకోటి జగతి
కడఁగి ప్రతివాఁడు మోక్షాధికారి కాడు
కడఁగి ప్రతివాఁడు రాజ్యాధికారి కాడు

చాతురిచే వివేకమున శాస్త్రసుహార్ద నిగూఢవాక్య ని
ర్ణీతము నీ జగద్ధనువనీతి సహస్రముఖంబులన్ బరి
స్ఫీతముగాఁగ నొక్కచో ముడివెట్టినలెన్ సహసా వినిర్ణయం
బాతతజీవకోటికి భయంకరమై యొసలారకుండఁగన్

ఈమెయి తద్రహస్యముల నెన్ని జగంబున ద్వైత్యబుద్ధి వ
ల్లీ సుమృదుగేహ వల్లి విమలీకృతముంబొనరించి భారత
శ్రీసతిలోని కూర్పు వివరించి ప్రజాఖిలజీవనంబు ధా
రా మృదుశాంతపావనసుధారంబుగఁ దీర్చిన తీర్పు చూచుచున్

పతి తనకోసమై విగహభావకృశుండయి వచ్చెడున్ స్పృహా
మతి యని వల్లికిం దెలిసి మానిని మానని మత్సరంబుచేఁ
బతికిని నందకుండఁ జను స్వామియు వల్లి మనస్సు సత్క్రియా
తతి విని కాంచుచున్ విరహతాపము ముమ్మడిగా నెసంగఁగన్

ఒకయూరఁ గుండపోతఁలు
మొకములు ముక్కలును గనులు మూఁతవడ మహా
చికము లవి పెల్లుగేగిన
చకితాత్మయు వల్లి వదలఁజాలద యచటన్

ఆ జాలిగుండె బాలిక
పోఁజాలద యపటు వదలిపో దనుచుఁ ద్వరా
శ్రీజంఘాలుఁడు స్వామియు
వేఁజని కనె వల్లి హృదయవీథిమల్లిన్

పరులకోసము దైన్యపడు భావమంతయు
కనుబొమ్మలంచునఁ గందళింప
పరిచర్య సాధురూపము పొందినట్టుల
నడచుచున్నట్టి యందంబు తెలుప
ఇల్లిల్లు తనకోసమే చూచుచున్నట్లు
కనులలోపలి వెల్గు కానిపింప
ఆత్మజీవితము సేవార్థ మన్నట్లుగా
నడికట్టు క్రొత్తచిహ్నమ్ము నెరప

సర్వమును దైవ మన్నట్టి సన్నయూహా
లేఁతచిన్నారి సవ్యతూలిక రచింప
బహుళశత ప్రార్థనాత్ముల పట్టు నల్లిఁ
గన్గొనియె స్వామి నిలచి యేకాగ్రమతిని

తా నెదురుపోయి పల్లికిఁ గానిపింపఁ
బెరిగి మరి యొక్కయింటఁ గన్పించె నేమి
యిప్పుడే వత్తు నంచు,నే స్మృతివహించు
పల్లి యాననబింబంబు తెల్లపోయె

తన యపచారము స్మృతి వ
చ్చిన దుఃఖంబో జనంబు చెందిన యా వ్యా
ధిని గూర్చినట్టి దిగులో
వనితామణి పరిహరించు సల్లాప సత్సిక

అలఘుప్రీతుఁడు స్వామి కూడఁ బ్రహ్మచర్యాభావముం బూనిన
ట్టుల నా వేసము వేసికొంచు నటులిట్టుల్ పోవుచున్ దీనతా
చలితాస్యుండయి నట్లుగా నభినయించన్ వల్లి కన్గొంచుఁ జే
తులకన్ భర్తను గూర్చి యిట్లనియె మర్యాదాకఠోరంబుగన్

మనుజుల కష్టముల్ దివిజమండలికిన్ బరిహాసపాత్రముల్
మనుజులు మాత్ర మా దివిజమండలి నెప్పుడు నాశ్రయింతు రే
మని యొద వన్న స్వామి చెలియా! పటుకోపము సంహారింపవే
వనులను దేవసేనయుఁ దపంబొనరించు ననుగ్రహారింపవే

తమ యాహారవిహారముల్ శుచితకున్ దవ్వై దురాచార సం
ఘములై కొల్చిన క్షుద్రదేవతలుగాఁ గ్రాంతామయుల్ భూప్రజల్
తమలో నున్న యనంతు నన్నెఱుఁగరీ త్వచ్ఛాంతిసేవాపరా
క్రమముల్ మెత్తురటంచు నవ్విభువుఁ బ్రాణచ్ఛటాభూతుఁడై

తన యోగవిద్యచేతను
జనముల దగు వ్యాధి మాన్చి జగతికి యోగా
సన విద్యయె వ్యాధినిరా
సనహేతు వటంచుఁ జూపి స్వామియుఁ జనఁగా

పతివెంటం జనె బాల బాలకదళీపత్రంబు చెక్కిళ్ళ సం
గతి రేకన్ గతిరేక మాల బలియుం గ్రై బూని యా చెక్కిళుల్
బలిమాలన్ బలిమాలినిం బెరిగి యా పద్మాస్యసద్మాస్యమం
దతిగంభీరిమఁ జొచ్చె [illegible]న యసూయాభావపర్యాప్తయై

రే నమృతాంశువెన్నెలలు తెమ్మెన ఝొమ్మనఁ జిన్నియాసుమా
మానిని వల్లి రేఁదొలిసమాగమమైన యనంతరంబునం
దూనిన కిన్క సిగ్గుపయి నొత్తిలి నుంచముఁ బ్లై బల్లినా
నూని శయించ జబ్బగొని యూచిన స్వామి విదుఁచ్చుకొంచునుఁ

క్రమముగ నేప్పుడొనిశి దిగఁ డిగ కంటి యనుంగుబిడ్డ యా
కమలవిశాలలోచన వొకాటపు వేనలిపూల వెంపు వి
భ్రమమునఁ దూలి సెజ్జపయి రాలగ నూపుపుచ్చి యూర్ధ దే
హామున నురంబు రాచికొన నామె జగాచియుకుంబు నెత్తునుఁ

నెలఁత గుంట గుంట నిఘ్నంబు తార్పతి
గాదె నిన్ను వెదుకఁగాను వచ్చి
మెఱసినట్టిచోట మెఱవక మెఱసితి
మెలత వేయియైన మిన్నులందు

నీకై మానువ భావమందితిఁగదే నీరేజపత్రేక్షణా
నీకై మానుపముఁ ద్యజించితిగదే నీరేజపత్రేక్షణా
నీకై బూని దురామయంపుజనులఁ సేవించితిఁ వెజ్జనై
నాకై సుంత యనుగ్రహింపఁగదవే నాళీకశ్రీకృశా!

ఓ సుకుమారచారువికచోత్పలలోచన! దేవసేన స
న్న్యాసిని యాదినుండియును నా యొక సతిపహించి యామెఁ గై
సేసితి నీవయుఁ సకలచేతము ప్రీతము నాకు నన్ను స
న్న్యాసముపుచ్చుకొమ్మనెదవా! మొగ మిట్టులఁ ద్రిప్పి వత్తువా

అనుచు బలవంతముగఁ గ్రిప్ప నభిముఖముగఁ
జాన తనతల పతిరొమ్ముఁ గోన దూర్చెఁ
బతియుఁ జక్కిలిగింతల పడతి జఘన
కటి భాగంబులన్ గలగలలు తెచ్చె

పనునడిఁ గొంతసేపటికి బ్రీతియభావము మీఱఁగాఁ బర
స్పరమును వార లిద్దఱుఁ బ్రసంగముచేయుచు వల్లి యిట్లనెన్
దిరముగ మీ కుటుంబము యతిప్రజ. మద్ది భయంబు నాకు నీ
చరణము లంటెదన్ బరవసంబున నన్నుఁ ద్యజించఁబోకు వే

అనిన స్వామి యిట్టు లనియె నోసీ! యాత్మ
నేను దేవసేన నైన విడువ
పడతి నిన్ను మేన వదలుదునే యంచుఁ
గౌగిలించుకొనియెఁ గమలనేత్రి

గంధర్వాళి తెక్కలమీఁద నెగురుచు
దేవసేనానామతీర్థ మొకఁడు
భారతీయప్రజా వైరాగ్యభావంబు
పాలించుచుండె శోభాపయోధి
యసురసేనా మహాహంకార భావంబు
పటురఘుంకారమ్ము పారఁద్రోల
కడఁగి పంచారించి కాలకంఠమహస్సు
నాత్మసీనమున షడాస్యదీప్తి

నిత్యబహి రంతరింద్రియ నిగ్రహోత్త
పరిణత తపోవివేకసంభార యగుచు
దినదినప్రోచ్చతేజో ఽవధీరితాల్ప
తారకాంశుప్రతానవర్ధిష్ణు వగుచు

సాహస్రఫణామణాళి గను
నీహారస్ఫూర్తిమయము నట్లి నిజతేజస్సం
దోహమున వెలుఁగఁజేసెడు
దేహులకై తాఁ గుభ్రన్నదీ క్షేత్రాదుల్

ఇది వైహిం[illegible]ష్మిక సంపాదనమను
షష్ఠాననము

శ్రీ వల్లీదేవసేనా విజయము మను
శ్రీ కుమారాభ్యుదయము
సంపూర్ణము.